శ్రీనివాసబాలభారతి_28

# అనసూయ

రచన :
ఎస్. బి. సీతారామభట్టాచార్యులు

ప్రధానసంపాదకుడు :
డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ :
శ్రీ జి. కుమారస్వామిరెడ్డి, ఐ. ఏ. ఎస్.,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
1983

T. T. D. Religious Publications Series No-155

SRĪNIVĀSA BĀLABHĀRATI - 28
( Children Series )

ANASŪYA
by S B. Sitarama Bhattacharyulu

*Chief - Editor :*
Dr. S. B. Raghunadhacharya

First edition 1983

Copies : 10, 000

Price : 1–00

*Published by :*
Sri G. Kumaraswami Reddi, I.A.S.,
EXECUTIVE OFFICER,
Tirumala Tirupati Devasthanams,
Tirupati

Art : CHAYA

Printed at :
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# ముందుమాట

ఒకతోట అందంగా కనులకు విందుచేయాలంటే, ముందు అందులోని పూలమొక్కల్ని చక్కగా పెంచాలి. సమాజం సుందరంగా రూపొందాలంటే భావిభారత పౌరులైన బాలలు సంస్కారంతో పెరగాలి. మనసంస్కృతి గొప్పదనం వారికి తెలియనంతకాలం వారెన్ని విద్యలు సాధించినా ప్రయోజనం శూన్యం. "మహా పురుషులు మహాపతివ్రతలు మనజాతికెందుకు గర్వకారణమైనారు? వారినుంచి మనం ఏ ఆదర్శాన్ని నేర్చుకోవాలి?" అనే విషయాన్ని వారి కథను చెబుతూ మన చిన్నారి బాబులకు, పాపలకు చెప్పగలిగితే వారికి మనమెంతో సంస్కృతీ సంపదనిచ్చిన వారమౌతాం. అలా సంస్కారంతో పెరిగిన బాలలు, తమ జీవితంలో ఎంతో మంచిని పెంచుకొని ఈ సమాజానికి ప్రేమను పంచుతారు. ఉత్తమ పౌరులై వారి కుటుంబానికేకాక, ఈ దేశానికిగూడ పేరు ప్రతిష్ఠలను సంపాదిస్తారు.

తిరుమల తిరుపతి దేవస్థానం, ఇలాంటి ఉద్దేశ్యంతోనే ఈ "శ్రీనివాసబాలభారతి" అనే పుస్తకమాలను, చిన్నపిల్లలకోసం

ప్రకటిస్తున్నది. దీన్ని బాలభారతి అని పిలిచినా పెద్దవాళ్లకు గూడ ఎంతో విజ్ఞానాన్నందిస్తూ ఇది ప్రతికుటుంబాన్నీ ఆకర్షిస్తున్నది. చక్కని ఆదర్శం కలిగి, చరిత్రప్రసిద్ధి పొందిన మహాపురుషుల, మహాపతివ్రతల కథలు ఇందులో చిన్న చిన్న వాక్యాల్లో చెప్పడం జరుగుతుంది. ఈ బాలసాహిత్యాన్ని చిన్నారిపాపలు బాగా చదివి ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాను.

ఈ బాలసాహిత్యప్రణాళికను చక్కగా రూపొందించి, మంచి రచనలను తయారుచేయించి, అందరికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య (కో-ఆర్డినేటర్, పబ్లికేషన్స్, టి. టి. డి.) గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికలో ఎందరో రచయితలు కళాకారులు సహకరిస్తున్నారు; వారందరికీ నా ధన్యవాదాలు.

ఉగాది
14—4—83

జి. కుమారస్వామిరెడ్డి, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

# స్వాగతం!!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా ॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక-ధార్మికాదర్శాలకు పేరుపడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖసంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. నేను భారతీయుణ్ణి ఇది తరతరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం' 'ఇది నా కర్తవ్యం' అని ప్రతిబాలుడూ బాలిక ఈ దేశసేవకు తనను అంకితం చేసుకుంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందఱో మహానుభావులు మహపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్కని

సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మన దాకా ప్రవహింపచేశారు. అహా! మనమెంత అదృష్టవంతులం! మన వెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్లను అర్థంచేసుకోవడం, వాళ్ల చరిత్ర మననంచేసుకోవడం వారి ఆదర్శాలు స్మరించడంకూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం.

బాలలూ! రండి! రండి!

నిండు మనస్సుతో మీ కిదే మా స్వాగతం!

ఉగాది
14-4-1983

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు

అనుకోకుండా అతిథులు లభించారు కదా! అని ఆ దంపతులు ఆనందపడిపోయారు. ఆతిథ్యమందించడానికి అన్ని ఏర్పాట్లూ అలా అలా జరిగిపోతున్నాయి. స్త్రీ నగ్నంగా వడ్డిస్తే గాని ఆతిథ్యం స్వీకరించమన్నారు అతిథులు. ఆహా! ఎంతటి అగ్ని పరీక్ష! సరేనన్నది ఆ మహాతల్లి. ఇదేం విడ్డూరం? రండి! భోజనం పెడతానంటే; మొండిమొలతో పెడితేనే స్వీకరిస్తా మనడం? అయినా; అలాగేనని అంగీకరించేవారెవరయినా ఉంటారా? మనచరిత్రలో అలాంటి కఠోరవ్రతాన్ని నిర్వహించి లోకకల్యాణం సాధించిన ఒకేఒక మహాసాధ్వి ధ్రువతారలా మెరుస్తోంది. ఎవరో తెలుసా? జగదభివందనీయ అనసూయ. ఆమె తాపసమణి అత్రి భార్యామణి.

వచ్చిన అతిథులు త్రిమూర్తులు. పాతివ్రత్యమహిమకు పసిపాపలై నగ్నంగా ఆమె అందించిన గోరుముద్దలనందుకొన్నారు పాపం! ముగ్గురమ్మలు; లక్ష్మీపార్వతీసరస్వతులు ముద్దుగుమ్మలై ఆమెకు పాదాక్రాంతలైనారు. అంతేకాదు; సుమతి భర్తను బతికించే ప్రయత్నంలో పదిరోజులను ఒకటిగా చేసిందీ ఈమే.

గులకరాళ్లను ఘుమఘుమలాడే గుగ్గిళ్లుగా నారదునికి వండి పడ్డించిం
రః వనితాతిలకమే.

ఇలా తన పాతివ్రత్యమహిమతో ఎన్నెన్నో ఘనకార్యాలన
సాధించిన అనసూయ పావనచరిత. కావాలి ఆమె చరిత మః
ఆడపడుచులకొక చేయూత. ఇక చదవండి —

— ప్రధానసంపాదకుడు.

# అనసూయ

మన సంస్కృతి:

మనది భారతజాతి. మన జాతి మహోజ్జ్వలచరిత్రకు పునాది మనసంస్కృతి. ఇది సనాతనమైనది. అతి విశాలమైనది. ఏ దేశానికైనా ఆదర్శప్రాయమైనది. ఏ కాలంలోనైనా నిలువగలిగింది. అందువల్లనే సాటిలేనిది. మన సంస్కృతి వేదోక్తమై వెలుగొందింది. ఉపనిషద్రహస్యాల ద్వారా లోకానిక శాంతిని ఉపదేశించింది. పురాణాలద్వారా మృదువుగా సమాజాన్ని సంస్కరించింది.

సత్యాహింసలను, క్షమాశౌచాలను, దయాధర్మాలను, శమదమాలను ఉగ్గుపాలతో నేర్పుతుంది మనసంస్కృతి. దైవభక్తిని, పితృభక్తిని, గురుభక్తిని, స్వామిభక్తిని, దేశభక్తిని, పతిభక్తిని, సర్వమానవసౌభ్రాతృత్వాన్ని చాటిచెబుతున్నది. ఆధ్యాత్మికచింతన, ఆత్మసంయమనం, ఆస్తికతాబుద్ధి, సత్ప్రవర్తన, పరోపకారదీక్ష, సర్వసుఖాపేక్ష, విశ్వబంధుత్వభావన మొ॥ మనసంస్కృతి సహజాభరణాలు.

ఎంతటో మహానుభావులు :

ఇలాంటి భారతీయసంస్కృతీ సాంప్రదాయాలను పుణికిపుచ్చుకున్న పుణ్యపురుషులు, పురంధ్రీమణులు ఎందరెందరో! వారి జీవితాలు చరితార్థాలు, ఆదర్శమయాలు, లోకకల్యాణకారకాలు. వీరిలో నరజన్మ కేవలం సుఖానుభవానికేర్పడింది కాదని నిరంతర తపోనిష్ఠతో నిఖిల నిగమసారాన్ని ఆకళింపు చేసుకొని మానవాళిని జాగృతం చేసిన మహర్షివర్యులు కొందఱు. శక్తిత్రయంతో శక్తినాథుని మించిన శౌర్యంతో శత్రువుల గడగడలాడించిన రాజన్యులు కొందఱు. చిన్ననాటినుంచే చాలా దైవభక్తితో అన్నిపదార్థాలలో పరమేశ్వరుని సాక్షాత్కరింపచేసుకున్న చిన్నారిబాలురు కొందఱు. పితృాజ్ఞాపరిపాలనతో తనతల్లిని వధించి మరల వరరూపంలో మమతామూర్తి మాతృమూర్తిని పొందిన బుద్ధిబలం ఒకరిదైతే, తండ్రిమాట ప్రకారం రాజ్యంవదలి అరణ్యం చేరి అష్టకష్టాలపాలై చివఱకు ప్రజారంజనకై సహధర్మచారిణిని కూడ కోల్పోయిన త్యాగనిరతి ఇంకొకరిది. గురుదక్షిణకై కుడిచేతి బొటనవేలునే సమర్పించగల గురుభక్తి కొకరు పాత్రులైతే, స్వామిభక్తితో దేశభక్తితో ప్రాణార్పణం చేసిన వారు ఎందఱో!

ఇలాగే పతి ప్రత్యక్షదైవమని, పతి సర్వస్వమని భావించి పతిచరణసేవాపారయణతతో సూర్యగమనాన్ని కూడ ఆపివేయజాలిన పాతివ్రత్యమహిమగల భారతనారీమణులు బహుళంగా కన్పిస్తారు. వారిలో వనితాభాగధేయ, పవిత్ర నామధేయ అనసూయ జీవితం నారీలోకానికే ఒక నందన పారిజాతం. ఆమె ప్రభావాన్ని ప్రస్తుతించడమే ఈ చిన్న ప్రయత్నం.

అనసూయ అంటే:

అసూయ పతనహేతువు. ఇది అంతశ్శత్రువులలో ఒకటి. స్త్రీలలో కొంచెం హెచ్చుంటారు. అనసూయ అని వినగానే మనకు తెలుస్తుంది; అసూయ లేనిది అనసూయ అని. నిజమే!. అనసూయ సాధారణవనిత కాదు . అసాధారణ స్త్రీమూర్తి. అన్ని భూతాలలోనూ అసూయలేకుండా వ్యవహరించడం ఆమె పేరును సార్థకం చేసింది. ఇతరుల ననుగ్రహింపజాలిన తపోవిశేషంచేత అనసూయ అసూయలేనిదిగా ప్రసిద్ధిపొందింది.

## పుట్టుపూర్వోత్తరాలు:

కర్దమప్రజాపతి నిరంతర విష్ణుపూజాతత్పరుడు. అతని భార్య లావణ్యజ్యోతి దేవహూతి. వీరి పుత్రికారత్నం అనసూయ. ఈమె స్వాయంభువమనువు మనుమరాలు. ఖ్యాతి, అరుంధతి మొ॥ వారు ఈమె సోదరీమణులు. ఋషి వర్యుడు వేదవేదాంగపారీణుడు సప్తర్షులలో ఒకడైన అత్రి ఈమెపతి. ఈమెకు చిన్ననాటినుంచీ వేదశాస్త్రాలతో పరిచయం. ఉంది. వినయ వివేకాలు ఈమెకు సహజభూషణాలు. కాలోచితమైన పతిసేవలో ఈమెకు మక్కువ ఎక్కువ. ఈమె పతిభక్తికి మెచ్చిన అత్రిమహర్షి అష్టాక్షరీమహామంత్రోపదేశం చేస్తాడు. ఆ ఉపాసనచేత యోగస్థితిని పొందిన ఈమె మహర్షులకు కూడా పూజనీయమైన మహోన్నత స్థానాన్ని పొందింది.

## పతివ్రతాశిరోమణి:

అనసూయ మహాపతివ్రత. ఈమె పాతివ్రత్యమహిమ లోకాన్ని అనేకసమయాల్లో ఆశ్చర్యచకితం చేసింది. కౌశిక పత్ని సుమతి తన పతిశాపాన్ని పురస్కరించుకొని సూర్యో

దయాన్ని ఆపేసింది. అనసూయ పదిరోజులను ఒకరోజుగా చేసి సూర్యుడుదయించేటట్లు చేసింది. మరణించిన సుమతి భర్తను మరల బ్రతికించేటట్లు చేసింది. నారదుని కోరికపై గులకరాళ్ళను గుగ్గిళ్ళుగా మార్చి ఆయన ఆకలిని తీర్చింది. లోకమాతలైన లక్ష్మీపార్వతీసరస్వతులను గెల్చింది. సర్వ జనాభిరాముడైన శ్రీరాముడు అరణ్యవాసకాలంలో సీతతో ఆశ్రమానికి వచ్చాడు. అప్పుడు ఈమె అత్రి ఆదేశానుసారం సీతకు పతివ్రతాధర్మాలను ఉపదేశించింది. ఎప్పుడూ వాడని పూలను, మనోహరాలైన ఆభరణాలను, మంగళప్రదాలైన వస్త్రాలను, అంగరాగాలను ఇచ్చింది. తన మహిమను పరీక్షించడానికి వచ్చిన త్రిమూర్తులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులను శిశువులనుచేసి లాలించింది. లోకమాతలు లక్ష్మీపార్వతీ సరస్వతులకు పతిభిక్షపెట్టి అత్తగారై నిలిచింది. త్రిమూర్తుల అంశతో దత్తాత్రేయుడనే పుత్రుణ్ణి పొందింది.

**పతివ్రతాధర్మం :**

ఒకే భర్తను మనసుతో మాటతో క్రియతో సేవించేవారు పతివ్రతలుగా పేర్కొనబడతారు. పతిని సేవించడమే వీరి

వ్రతం అందే నియమం. వీరినే సాధ్వీమణులు, సతీరత్నాలు అని వ్యవహరిస్తారు. వీరికి పాతివ్రత్యమే ప్రాణం. పతియే దైవం. పతిదేవారాధనం వీరి నిత్యకృత్యం. అనేకవిధాల పతియొక్క జీవితలక్ష్యానికి తోడ్పడుతూ భర్తమనస్సును సంతోషింపచేయటం వీరి పరమధ్యేయం. వీరికి భర్త ఉండే పర్ణశాలే ఎనలేని రత్నశాల. నారవస్త్రాలే చీనిచీనాంబరాలు. నీవారాన్నమే పరమాన్నం. భర్తపాదాలే హంసతూలికా తల్పాలు. పతితోపాటు ఆత్మసంయమనం జీవశక్తిని పెంచే రసాయనం. ఎల్లప్పుడు అతణ్ణి సేవించడం మహాభాగ్యం.

**పతివ్రతారత్నాలు:**

ఇలాంటి పతివ్రతామతల్లులలో సుమతీ సుకన్యలు, అహల్యారుంధతులు, లోపాముద్రానసూయలు మహర్షి పత్నులు, ఇలాగే సీతాసావిత్రులు, చంద్రమతీదమయంతులు ఊర్మిళాశకుంతలలు మొ॥వారు రాజకాంతలు. మండోదరీ సులోచనా ప్రభృతులు రాక్షసవనితలు.

ఒక ధ్రువతార :

పైన పేర్కొన్న పతివ్రతలలో అనసూయ ఒక విశిష్ట మైన చరిత్ర గలది. మిగిలిన పతివ్రతామతల్లుల జీవితాలు వేఱు, అనసూయ జీవితం వేఱు. వారు సాధించిన విజయాలు వేఱు, ఈమె సాధించిన విజయాలు వేఱు. ఇతరుల జీవితాలు స్వార్థంతో ముడిబడినటువంటివి. వారి జీవితాలలో ఎదురైన సంఘటనలు వారివారి మేలుకో కీడుకో సంబంధించినవి. అనసూయ జీవనయాత్రలో కూడా అనేకసంఘటనలు ఎదురైనాయి. కాని అవి అన్నీ పరప్రయోజనాన్ని సాధించి అసాధారణాలుగా రూపొందాయి. ప్రజలను ఆశ్చర్యపర చాయి. దేవకార్యాలనుద్దేశించి పదిరోజుల నొకరోజుగా చేయటం సామాన్యమైన విజయమా? తిరుగులేని మాండవ్య మహర్షి శాపాన్ని తత్ఫలితాన్ని తిరస్కరించి మరణించిన వ్యక్తికి మరల ప్రాణాన్ని ప్రసాదించటం ఘనవిజయంకాదా? సృష్టిస్థితిలయకర్తలనే చిన్నారిశిశువులను చేసి జోలపాడటం చిన్నవిషయం కాదు కదా! ఈ విధంగా పరిశీలిస్తే అనసూయ పతివ్రతగా సాధించిన విజయాలు ఎన్నో. అందువల్లనే

అనసూయ పతివ్రతలలో అగ్రగణ్య అయింది. ఒక ధ్రువ తారగా ప్రకాశించింది. సాటిలేని పతివ్రతగా ప్రసిద్ధిగాంచింది.

అత్రిప్రశంస:

అనసూయ అత్రిమహర్షికి ధర్మపత్ని. అత్రిమహర్షి బ్రహ్మమానసపుత్రుడు. సప్తర్షులలో అగ్రగణ్యుడు. అఖండ తపశ్శక్తిసంపన్నుడు. మహాప్రభావశాలి. ఈతని ఆశ్రమం బహుప్రసిద్ధమయింది. పరమపవిత్రమైందికూడా. ఇక్కడికి మహర్షులు ఎప్పుడూ వస్తూంటారు.

అత్రిమహర్షికి అనసూయ అంటే సహధర్మచారిణిగా ప్రేమాభిమానాలు, సాధనకారణంగా గౌరవంకూడా ఉన్నాయి. సీతారామలక్ష్మణులు అరణ్యవాసకాలంలో తన ఆశ్రమానికి వచ్చినపుడు రామునితో అత్రిమహర్షి అనసూయసాధించిన విజయాలను గూర్చి ముచ్చటిస్తాడు. ఒకప్పుడు పదిసంవత్సరాలు అనావృష్టితో లోకమంతా మలమల మాడిపోగా అనసూయ తన తపశ్శక్తితో కందమూలాలను, ఫలాలను సృష్టించినట్లు గంగను కూడా ప్రవహింపజేసినట్లు చెబుతాడు.

పదివేలసంవత్సరాలు ఈమె కఠోరమైన తపస్సు చేసినట్లు తెలియజేస్తాడు. చాంద్రాయణాదివ్రతాలను కూడా తన సహధర్మచారిణి అనసూయ నిర్విఘ్నంగా నిర్వర్తించినట్లు పేర్కొంటాడు. అట్లే దైవకార్యసాధనకై పదిరోజుల కాలాన్ని ఒక్కరోజుకు తగ్గించినట్లు తెలియజేస్తాడు. ఈ విధంగా ఘన విజయాలు సాధించిన అనసూయ ప్రపంచానికి పూజనీయు రాలని వర్ణిస్తాడు. అనసూయను కీర్తిమతిగా కీర్తిస్తాడు. ఇలాంటి మహాకార్యాలను సాధించడంవల్లనే లోకానికి అనసూయ 'అనసూయ' అయిందనిప్రకటిస్తాడు. అనసూయ అంటే భర్త అత్రికి అనన్యగౌరవం ఉన్నది.

సంస్కారంగల దాంపత్యం:

అనసూయకుకూడా అత్రిమహర్షిపైన ఎంతో భక్తి. పతి శుశ్రూషవిషయంలో అనసూయ సాటిలేనిదిగా ప్రశంసింప బడింది. అత్రిమహర్షిమాట అనసూయకు వేదవాక్కు. తన భర్త అత్రిఆదేశానుసారం ఆమె అకాలంలో అరణ్యవాసం చేస్తున్న సీతను ఓదారుస్తుంది. రామునివెంట అరణ్యానికి రావడాన్ని ప్రశంసిస్తుంది. పతీధర్మాలను గూర్చి బోధి

స్తుంది. అనసూయ అత్రిమహర్షులు చాల ఉత్తమసంస్కారం గల గొప్ప వ్యక్తులు.

వ్యసనాలకు లొంగిపోయిన బ్రాహ్మణుడు:

పూర్వం మధురాపురమనే గ్రామంలో కౌశికుడనే బ్రాహ్మణుడుండేవాడు. అతని భార్యపేరు సుమతి. కౌశికుడు గొప్ప ధనికుడు. సుమతి సాధుస్వభావంతో పతిసేవచేస్తూ ప్రశంసలనందుకొన్నది. ఇలా కొంతకాలం గడిచింది. ధనమదం కౌశికుని కన్నంటింది. క్రమంగా మద్యపానం మొదలయి ంది మరికొంతకాలంలోనే కౌశికుడు వేశ్యాలోలు డయ్యాడు. ధనమంతా వేశ్యాహస్తగతమైంది. కౌశికుడు కటికిదరిద్రుడైనా మద్యపానాన్ని వేశ్యాస్నేహాన్ని వదలలేకపోయాడు. దురాచారుడైన తన భర్తను చూసి సుమతి లోలోపల చాలా దుఃఖిస్తూ ఉండేది. సకలవ్యసనాలకు బానిస అయిన కౌశికుడు కుష్ఠురోగి అయ్యాడు. అయినా అతనిలో మార్పురాలేదు.

ఆ వారకాంత కావాలి ।

సుమతికి భిక్షాటనమే శరణ్యమైంది. చెట్టునీడలో నివాసం. అయినా కౌశికునిలో పరివర్తన ఆవంతకూడా రాలేదు. కొంతకాలం గడిచింది. భిక్ష పెట్టే ఒకవారకాంతను చూసి ఆమె నెలాగయినా సమకూర్చవలసిందిగా సుమతితో చెప్పాడు. సుమతి అతని కోర్కెకు బాధపడి వారించ ప్రయత్నించింది. కాని ప్రయోజనం శూన్యం. చివఱకు ఎలాగో ఆ వారకాంతను ఒప్పించి కౌశికుని ఒకతట్టలో ఎక్కించుకొని ఆమె ఇంటికి తీసుకొని వెళ్ళింది. అక్కడ ఆ వారకాంత ఈతని కన్నుతెరపించి సుమతిని సతిగా గౌరవించమని బోధించింది. కౌశికుని అజ్ఞానం నశించింది. తిరిగి తన భర్తను తట్టలో పెట్టుకొని సుమతి తీసుకొని వస్తోంది.

సూర్యోదయం కాకుండుగాక ।

అదేసమయంలో మాండవ్యుడనే ఒకమహర్షి దొంగ తనం చేసి శూలరోపితుడయ్యాడు. చీకటిలో కౌశికుని పాదం మాండవ్యునికి తగలగా ఆతడు మరింత బాధపడి పదిరోజుల తరువాత అయ్యే సూర్యోదయంలో నీ తలప్రుక్కలయి

మరణిస్తావని శపించాడు. సుమతి మాండవ్యుని అనేక విధాల ప్రార్థించింది. కాని మాండవ్యుడు బదులు పలుకలేదు. తనభర్తను మన్నించి తనను శపించమని వేడుకొంది. మాండవ్యుడు మౌనం వహించాడు. దానితో పతివ్రత అయిన సుమతి జగద్రక్షకుడైన సూర్యుడు తన సుమంగళీత్వాన్నే హరిస్తాడా? అతడలా చేయడని భావించి నేను నా నాథుని త్రికరణశుద్ధిగా సేవిస్తూంటే సూర్యోదయమే కాకుండుగాక! అని ప్రతిశాపమిచ్చింది. పతివ్రత అయిన సుమతిశాపంతో భానుడుదయించలేదు.

## నేను బ్రతికిస్తాను!

లోకంలో చీకటి దట్టమైంది. యాగాదులకు అంతరాయమేర్పడింది. జగత్తు జడమై దైనందిన వ్యాపారం కుంటుపడింది. దేవతలీవిషయం తెలిసికొని బ్రహ్మను శరణు వేడారు. బ్రహ్మ మహాపతివ్రత అయిన అనసూయను వేడుకోమని చెప్పాడు. దేవతలు అత్రి ఆశ్రమం చేరారు. పతివ్రతాశిరోమణి అనసూయకు పై విషయాన్ని తెలిపారు. అనసూయ సూర్యు డుదయించకపోవడానికి సుమతి

పాతివ్రత్యమే కారణమని తెలుసుకొని పదిరోజులను ఒకరోజుగా చేసింది. సుమతిని సూర్యోదయం చేయించమని కోరింది ఆమె తనభర్తకు తగిలిన శాపాన్ని ప్రస్తావించింది. అనసూయ నీభర్త ప్రాణాలకెలాంటి అపాయం లేదు. నేను బ్రతికిస్తాను సూర్యోదయమయ్యేటట్లు చేయుమన్నది. సుమతి సూర్యుని ప్రార్థించింది. సూర్యుడు ఉదయించాడు. మాండవ్య శాపానుసారం కౌశికుడు మరణించాడు. మహాప్రభావశాలిని యైన అనసూయ కౌశికుని బ్రతికించింది. దైవవశాన కౌశికుడు ఆరోగ్యవంతుడయ్యాడు. సుమతీకౌశికులిద్దరూ సుఖంగా జీవించారు. ఇలా అనసూయ సుమతి మాంగల్యాన్ని నిలబెట్టింది.

సీతారాములు :

అతిపవిత్రమైన ఆదర్శవంతమైన జీవితాన్ని మానవు లకు ఆచరణాత్మకంగా అందించిన అవతారమూర్తులు సీతా రాములు. వీరు పాతివ్రత్యానికి ఏకపత్నీవ్రతత్వానికి సం తాలుగా జీవించిన పుణ్యదంపతులు. తరతరాలుగా భారతీ యుల హృదయాలలో గూడుకట్టుకున్న దైవస్వరూపాలు ప్రతి ఊర ప్రతిఇంట నెలకొని ఉన్న వెలుగుదివ్వెలు.

అనసూయ ప్రశంస:

ఇలాంటి వీరొకప్పుడు అరణ్యవాసకాలంలో మహర్షుల దర్శనం చేస్తూ అత్రిఆశ్రమం చేరినపుడు ఆమహర్షి వీరిని సాదరంగా ఆహ్వానిస్తాడు. సహధర్మచారిణి అనసూయను పిలిచి సీతారాముల పరిచయం చేస్తాడు. అనసూయ తపస్సాధనను, వ్రతాచరణాన్ని మహిమలను సీతారాములకు విశదీకరిస్తాడు. రాముని పుత్రునిగా భావించిన అత్రిమహర్షి అనసూయను తల్లిగా తెలిపి సీతను ఆమెదగ్గరికి పంపమని రామునితో చెబుతాడు. రాముని అనుమతితో సీత అనసూయను సమీపించి నమస్కరిస్తుంది. కుశలం అడుగుతుంది. అనసూయ అకాలంలో ఏర్పడిన అరణ్యవాసానికి బాధపడవద్దని సీతను ఓదారుస్తుంది. రామచంద్రుని అనుసరించి అరణ్యానికి రావటాన్ని ప్రశంసించి ఇలా ఉపదేశిస్తుంది.

సతీధర్మోపదేశం:

'తల్లీ! స్త్రీలకు భర్త నగరంలో ఉండేవాడైనా, అడవుల్లో ఉండేవాడైనా సేవించదగ్గవాడే. అలాగే పాపి

యైనా, పుణ్యశీలుడైనా ప్రేమించదగ్గవాడే. దుశ్శీలుడైనా, కాముకుడైనా, డబ్బులేనివాడైనా సతులకు పతిప్రత్యక్షదైవం. ఎంతగా విమర్శించినా సతులకు పతికంటే బంధువు మరొక్కడులేడు. ఇతడే అన్నిదశలలో ఆమెకు రక్షకుడు. ఈ సూక్ష్మం తెలియక కొందఱు దుష్టస్త్రీలు పరపురుషులను కోరి అపకీర్తిని, ధర్మభ్రంశాన్ని పొందుతున్నారు. నరకంపాలవుతున్నారు. గుణవంతులైన నీలాంటివారు సతీధర్మాన్ని ఆచరించి స్వర్గాన్ని చేరుతారు. ఈ విధంగానే నీవు పతివ్రతా నియమాలను ఆచరిస్తూ కీర్తిని, మహాభాగ్యాన్ని పొందు అని చెబుతుంది.

వాడని పూలు :

అప్పుడు సీత రాముని మంచిప్రవర్తనను ఆమెకు చెబుతుంది. సీతమాటలకు ఎంతో సంతోషించి అనసూయ ఎప్పుడూ సుగంధపరిమళాన్ని విరజిమ్మే పూలను, మంగళప్రదమైన ఆభరణాలను, వస్త్రాంగరాగాదులను ఇస్తుంది. సీత కూడా వాటిని సబహుమానంగా స్వీకరించి నమస్కరించి అనసూయ ఆశీర్వచనాలను అందుకుంటుంది. అనసూయ

తానాచరించే పతివ్రతాధర్మాలను, తోటిస్త్రీలకు బోధించేదిగా గోచరిస్తుంది. పరమపావని సీతకుసైతం సతీధర్మాలను బోధించిన ఘనత అనసూయకే దక్కింది.

**కలహభోజనుడు :**

నారదుడు బ్రహ్మమానసపుత్రుడు. ఇతడు దేవర్షి. అనన్యమైన విష్ణుభక్తి కలవాడు. నిరంతరం నారాయణ నామోచ్చారణం చేయడం ఆయన వ్రతం. స్వేచ్ఛగా ముల్లోకాలలో సంచరిస్తాడు. మహర్షులకు కూడా మాననీయుడు. పవిత్రకార్యాలలో ప్రముఖపాత్ర ఇతనిదే. ఇతడు కొన్ని సందర్భాలలో కొందరిని పరీక్షిస్తుంటాడు. ఆ పరీక్షలు తిరిగి తనకే పరీక్షలై ఎదురునిలిచినా వెనుకంజవేయడు. తాననుకున్నకార్యం రసవత్తరంగా ముగియడానికి కొన్ని కలహాలు కూడా సృష్టించగల సమర్థుడు; కాదు కాదు సిద్ధహస్తుడు. అందువల్ల 'కలహభోజనుడ'ని ఇతనికొక బిరుదు కూడా వచ్చింది.

**గులకరాళ్ళను గుగ్గిళ్ల చేయాలి :**

ఇలాంటి నారదుడికి ఉన్నట్లుండి హఠాత్తుగా తీరని ఆకలి పుట్టింది. గులకరాళ్ళను మూటకట్టాడు. ఎవరు గుగ్గిళ్ళ

చేసి ఇస్తారా అని ఆలోచించి చివఱకు లక్ష్మి సరస్వతి పార్వతుల దగ్గరకు వచ్చాడు. ఆ సమయంలో త్రిమూర్తుల పత్నులు ఈ లోకంలో మనల్ని మించిన పతివ్రతలెవరైనా ఉన్నారా? అనే జిజ్ఞాసలో ఉంటారు. చాలారోజులుగా తీరని ఆకలిచే బాధపడుతున్నానన్నాడు నారదుడు. ఈ గులక రాళ్ళను గుగ్గిళ్ళుగా చేసి తన ఆకలిబాధను నివారించమని ప్రార్థించసాగాడు. దేవేరులు నివ్వెఱపోయారు. గులకరాళ్ళను గుగ్గిళ్ళుగా మార్చటమా? సాధ్యంకాని విషయం. మహర్షీ! నీవు కోరినట్లు గులకరాళ్ళను గుగ్గిళ్ళుగా మార్చేవారెవరైనా ఉంటే వారికి మేము దాస్యం చేస్తాం అన్నారు. వెంటనే నారదుడు మహాపతివ్రతలు మానవకాంతలలో ఉన్నారు. నేనీ గులకరాళ్ళను గుగ్గిళ్ళుగా చేయించి చూపిస్తాను చూడండి, అని ప్రతిజ్ఞచేసి భూలోకానికి హరినామస్మరణతో దిగి వచ్చాడు.

గులకరాళ్ళు గుగ్గిళ్లైనాయి:

నారదుడు సరాసరి అత్రిమహర్షి ఆశ్రమానికే చేరుకున్నాడు. అనసూయ అత్రిమహర్షి, దేవర్షికి స్వాగతం

పలికారు. సముచితాసనంపై కూర్చున్న నారదుని ఆర్ఘ్య
పాద్యాలతో పూజించారు. ఒకప్రక్క తీరని ఆకలిబాధ
నారదుడు ఎలాగో గులకరాళ్ళమూటను విప్పాడు. గుగ్గిళ్ళగా
చేసి ఇమ్మని సాధ్వి అనసూయను కోరాడు. ఆమె చిరు
నవ్వుతో గులకరాళ్ళను చేతికి తీసుకొన్నది. తన పతిదేవుని
స్మరించింది. క్షణంలో గులకరాళ్ళు గుగ్గిళ్ళుగా మారాయి.
నారదుని ఆకలి తీరింది.

నారదుడు అనసూయ మహిమను ప్రశంసించాడు.
నీ ప్రభావం అద్వితీయమని నమస్కరించాడు. వారిదగ్గర
సెలవు తీసికొని ముగ్గురు అమ్మలదగ్గరకు వెళ్ళాడు. అనసూయ
పాతివ్రత్యమహిమను వివరించాడు. గుగ్గిళ్ళను అందించాడు.
దేవేరులు ఆశ్చర్యచకితులయ్యారు. అనసూయ జీవితంలో
ఈ సంఘటన ఒక మైలురాయి. ఈ సందర్భం ఈమెను
త్రిలోకపూజ్యగా చేసింది. సాధన ఉంటే మానవులు దేవతలు
కావచ్చు, దైవశక్తిని మించిన శక్తిని సంపాదించవచ్చు,
అని భావించడానికి ఇది చక్కని నిదర్శనం.

## సృష్టికర్త బ్రహ్మ:

బ్రహ్మవిష్ణుమహేశ్వరులు త్రిమూర్తులు. వీరే ప్రపం

చానికి సృష్టిస్థితిలయకారకులు. వీరిలో బ్రహ్మ సత్యలోక నివాసి. ఇతడే సృష్టికర్త. చరాచరజంతుజాలానికి జీవాన్ని పోసేవాడు. ఇతడే విధిగా విధాతగా చతుర్ముఖుడుగా ప్రసిద్ధుడు. వాగ్దేవి సరస్వతి ఇతని భార్య. హంస ఇతని వాహనం. ఇతడు రజోగుణాన్ని ప్రవర్తింపచేస్తాడు. ఇతడు మేల్కొని ఉన్నప్పుడు జీవరాసులు చైతన్యంలో ఉంటాయి. నిద్రించేటప్పుడు చైతన్యంలేక జడాలౌతాయి.

స్థితికారకుడు విష్ణువు:

ఇక రెండవవాడు విష్ణువు. వైకుంఠం ఇతని నివాసం. ఇతడే స్థితికారకుడు. చరాచరజంతుజాలం రక్షణభారం ఈతనిపై ఉంది. ఇతడే నారాయణుడు. సకలైశ్వర్యాధిదేవత లక్ష్మి ఇతని భార్య. గరుత్మంతుడు వాహనం. సత్త్వగుణ ప్రవర్తకుడైన ఇతడు సర్వాంతర్యామి. అన్ని భూతాలలో వ్యాపించి ఉన్నాడు.

లయకారకుడు మహేశ్వరుడు:

మూడవవాడు మహేశ్వరుడు. కైలాసపర్వతం ఇతని నివాసం. లయకారకుడీతడే. సర్వజంతుజాలాన్ని నశింప

జేయడం ఇతని కర్తవ్యం. ఇతడు శివుడని, హరుడని, శంకరుడని పిలువబడుతాడు. పార్వతి ఇతని పత్ని. ఇతని వాహనం వృషభం. మహేశ్వరుడు తమోగుణాన్ని కలిగిసాడు.

### వాహనాలు ముందుకు వెళ్ళలేదు :

సృష్టిస్థితిలయకర్తలైన త్రిమూర్తులు ముగ్గురు ఒకప్పుడు మేరుపర్వతంవైపు పయనించాల్సి వచ్చింది. బ్రహ్మ హంసను అధిష్ఠించాడు. విష్ణువు గరుడవాహనారూఢుడైనాడు. మహేశ్వరుడు వృషభాన్ని ఆరోహించాడు. గగనవీధిని ప్రయాణం సాగుతోంది. మార్గమధ్యంలో త్రిమూర్తుల వాహనాలు హఠాత్తుగా ఆగిపోయాయి. త్రిమూర్తులు ఎంతో ప్రయత్నించారు. ప్రయోజనం శూన్యం. అప్పుడు గరుత్మంతుడు 'దేవేశ్వరులారా! ఇక్కడ క్రిందిభాగంలో మహర్షిసత్తముడైన అత్రిఆశ్రమం ఉంది. అది చాల పవిత్రమైంది. అతని సహధర్మచారిణి అనసూయ. ఈమె మహాపతివ్రత. గొప్పతపస్విని. అలాంటి అనసూయ అత్రిమహర్షుల ఆశ్రమం మీదుగా వెళ్ళడం ఎవరితరంకాదని అంటాడు. త్రిమూర్తులు మార్గాన్ని మార్చుకొని పయనించి తిరిగి స్వస్థానాలకు చేరు

కుంటారు. కాని లోలోపల అనసూయ పాతివ్రత్యాన్ని తత్ప్ర భావాన్ని గురించి ఆలోచిస్తారు. ఒక మహర్షిపత్నికి ఇంతటి ప్రభావమా? పాతివ్రత్యానికి ఇంతటిశక్తి ఉందా? చాలా ఆశ్చర్యంగా ఉంది' అనుకున్నారు. అలాంటి సాధ్వీలలామ అనసూయను తప్పక దర్శించి ఆమె పాతివ్రత్యమహిమను తెలిసికొని విశ్వవిఖ్యాతం చేయాలనుకున్నారు.

మా ఆతిథ్యం స్వీకరించండి :

అనసూయను పరీక్షించాలనుకొని త్రిమూర్తులు ఋషి వేషాలను స్వీకరించారు. అనుకున్నక్షణంలోనే అత్రిమహర్షి ఆశ్రమం చేరతారు. అనసూయతో కూడా అత్రి వారికి ఎదురు వెళ్ళి స్వాగతం పలుకుతాడు. వారిరాక ఎంతో ఆనందాన్ని కలిగించిందంటాడు. దంపతులు వారిని స్తుతి చేస్తారు. అర్ఘ్య పాద్యాలతో అర్చిస్తారు. తమ ఆతిథ్యాన్ని స్వీకరించా ల్సిందిగా ప్రార్థిస్తారు. ఋషివేషాలలో ఉన్న త్రిమూర్తులు అందుకు తమ అంగీకారాన్ని వెల్లడి చేస్తారు.

మాకొక వ్రతముంది :

అనసూయ చాలా భక్తిశ్రద్ధలతో ఆహారపదార్థాలను

తయారుచేస్తుంది. మహర్షి త్రిమూర్తులను భోజనానికి ఆహ్వా నిస్తాడు. త్రిమూర్తులు అత్రిమహర్షితో ఇలా అంటారు- 'మహర్షీ! మాకొక వ్రతం ఉంది. మాకు భోజనపదార్థాలను వడ్డించే స్త్రీ వివస్త్రగా ఉండాలి. అలా ఐతేనే మేము మీ ఆతిథ్యాన్ని స్వీకరిస్తాం. లేకపోతే వీలుకాదు'. అందుకు అత్రిమహాముని వారికి నమస్కరించి 'మహాత్ములారా! మీరు ఒక్కరుగాక ముగ్గురూ ఒకేసారివచ్చి మమ్మల్ని ఇలా అను గ్రహించారు. ఇంతకంటే మాకేం కావాలి? మీ దర్శనభాగ్యం చేతనే మాజన్మలు ధన్యమయ్యాయి. మహనీయులైన తమకు భోజనంపెట్టడమనే అదృష్టం అందరికీ లభిస్తుందా? మా అదృష్టంచేత అది మాకు లభించబోతోంది. కాబట్టి మీ వ్రతానికి నా ఆశ్రమంలో భంగం వాటిల్లటమా? మహాపచారం మీ ఇచ్ఛానుసారం వ్రతభంగం కలుగకుండా నేను చూస్తాను' అని సాదరంగా వారిని ఆహ్వానించి వారి వ్రతనియమాన్ని అనసూయకు తెలిపాడు.

## త్రిమూర్తులు పసిపాపలైనారు:

అనసూయ భోజనపాత్రలను సిద్ధంచేసి ఆసనాలను

అమరిస్తే త్రిమూర్తులు ఆసనాలపై కూర్చున్నారు. అనసూయ తన పతిదేవుడైన అత్రిమహర్షిని మూడుసార్లు స్మరించి "నా పాతివ్రత్యానికి భంగం కలుగకుండుగాక!" అని చేతిలో ఉన్న జలాన్ని త్రిమూర్తులపై చల్లింది. అంతలో వారు చిన్నారి బాలురయ్యారు. అనసూయ వారు కోరిన విధంగానే భోజనపదార్థాలను వడ్డించి తినిపించింది.

భర్తలకోసం:

అనసూయ ఆ శిశువులను పుత్రవాత్సల్యంతో తన దగ్గఱ ఉంచుకొని పెంచసాగింది. వారి చిరునవ్వులను చూస్తూ చిలుకపలుకులను వింటూ మరింత సంతోషిస్తూండేది. అత్రిమహర్షికూడా తన భార్యమహిమకు విస్మితుడై అలాంటి బాలుఱతో వినోదంగా కాలం గడిపేవాడు. ఇలా త్రిమూర్తులు బాలురై భూలోకంలో ఉండిపోయారు. లక్ష్మీపార్వతీసరస్వతులు ముగ్గురూ తమ భర్తల జాడ తెలియక పోవడంతో ఎంతో బాధపడ్డారు. రాక్షసులు తమ నాథులనేమి చేశారోనని భయపడ్డారు. ఇలాఉండగా ఒకనాడు వారిదగ్గరికి నారదుడు వస్తాడు. వారా మునినాథుని తమ నాథులను గురించి అడిగారు.

త్రిమూర్తులకు తిరిగి నిజస్వరూపం :

నారదుడు వారికి ఇటీవల తాను అత్రిమహర్షి ఆశ్రమానికి వెళ్లానని అక్కడ ముగ్గురు చిన్నారిబాలురు అనసూయ చేత పెంచబడుతున్నారని అందరూ ఆ పసిపిల్లలను చూసి అనసూయాదేవి అదృష్టాన్ని వేనోళ్ల పొగడుతున్నారని చెప్పాడు. అనసూయమహిమను వర్ణనాతీతమని, ఆ బాలురను ఆమె పుత్రవాత్సల్యంతో అల్లారుముద్దుగా పెంచుతున్నదని అన్నాడు. ఆ పిల్లల తేజస్సుచూస్తే మీ భర్తలే గుర్తుకు వస్తున్నారన్నాడు. తప్పక అనసూయ దగ్గరికి వెళ్లి పతిభిక్షను అర్థించక తప్పదని చెప్పాడు. లక్ష్మిపార్వతి సరస్వతి చేసేదిలేక అనసూయను పతిభిక్షను కోరడానికి నిర్ణయించుకుంటారు.

పతిభిక్షను అర్థిస్తూ అమ్మలు ముగ్గురు అనసూయ దగ్గరకు వెళ్లారు. వారిని ఆహ్వానించి సత్కరిస్తుంది అనసూయ. విషాదకారణమేమిటని వారిని అనసూయ వినయంతో అడుగుతుంది. వెంటనే లక్ష్మిపార్వతీసరస్వతులు ఆమెను "పతిభిక్ష పతిభిక్ష" అంటూ అర్థిస్తారు. లోకమాతల

దైన్యాన్ని చూసిన అనసూయహృదయం ఆర్ద్రమౌతుంది. వెంటనే మంత్రజలాన్ని బాలురుగా ఉన్న త్రిమూర్తులపైన ప్రోక్షిస్తుంది. త్రిమూర్తులు సహజస్వరూపాలతో దర్శన మిస్తారు.

### దత్తాత్రేయుని జననం:

దేవేరుల ముఖాల్లో దైన్యం మాయమౌతుంది. కాంతి రేఖ మెరుస్తుంది. త్రిమూర్తులు అనసూయ మహాపతివ్రత, అసమానమహిమాన్విత అని కీర్తిస్తారు. అనసూయను అనుగ్రహించాలనుకొని వరాన్ని కోరమంటారు. ఆమె మీరు ముగ్గురూ నాకు కుమారులయ్యేటట్లు వరాన్ననుగ్రహించ మంటుంది. వారట్లేనని తమ మూడంశలతో దత్తాత్రేయు డనే పుత్రుని అనుగ్రహిస్తారు. ఇలా అత్రి అనసూయల జీవితాలు సఫలమౌతాయి.

### ఉత్తమజన్మ - మానవజన్మ:

సృష్టి చర, అచర అని రెండువిధాలు. ఈ సృష్టిలో అనేకరకాల జీవరాసులున్నాయి. అవి జరాయుజాలు, స్వేద జాలు, అండజాలు, ఉద్భిజాలని నాల్గురకాలు. జరాయుజాలు=

మావి వల్ల జన్మించేవి: మనుష్యులు, గోవులు మొదలైనవి. స్వేదజాలు=ఉక్కనుండి పుట్టేవి: పురుగులు, ఈగలు మొదలైనవి. అండజాలు=గ్రుడ్డువల్ల ఏర్పడేవి: పక్షులు, పాములు మొదలైనవి. ఉద్భిజాలు=పుట్టేటప్పుడు భూమిని చీల్చుకొని ఉద్భవించేవి: చెట్లు, లతలు మొదలైనవి. ఇలాంటి చరాచర ప్రాణికోటిలో మానవుడు ఉత్తమమైన పుట్టుక కలవాడు ఇతర జీవరాసులలో కంటే ఇతనికి సహజంగా కొంతజ్ఞానం అధికంగా ఉంది.

నేటిబాలలే:

మానవుడెంతటి జ్ఞానవంతుడైనా ప్రకృతి కలిగించే అనేకవిధాలైన భీభత్సాలకు అందులో వచ్చే పరిణామాలకు నిలద్రొక్కుకుని నిలబడాలంటే బాల్యంనుంచే ఉత్తమ సంస్కారం ఎంతైనా అవసరం. ఉత్తమసంస్కారంగల బాల బాలికలు జాతికే గర్వకారణమౌతారు. తమ జీవితాన్ని సుఖమయం చేసుకుంటారు. తమచుట్టూ ఉన్న సమాజాన్ని సంస్కరిస్తారు. దైవప్రతిరూపాలనిపించుకుంటారు.

ఈ విధంగాచూస్తే అనసూయ మనకొక ఆదర్శ పుత్రికగా, ఆదర్శకాంతగా, పతివ్రతగా, గొప్పతపస్వినిగా మహాయోగినిగా, ప్రాణదాత్రిగా, పతివ్రతాధర్మబోధినిగా, సాధనకు పెట్టినపేరుగా, మహిమకు మారుపేరుగా గోచరిస్తుంది.

మహాపతివ్రత అనసూయ జీవితం సమాజానికి నూతనోత్తేజాన్ని కల్గిస్తుంది. ఆమె పవిత్రత, సాధన స్త్రీజాతికి జీవితపాఠాన్ని ప్రబోధిస్తాయి.